


# ఐదు ప్రశ్నలు

పూర్వకాలమందు కౌశాంబీ నగరంలో రత్నాకరుడనే కోటీశ్వరుడు ఉండే వాడు. అతనికి సులోచన అనే ఒక్కగా నొక్క ఆడపిల్ల పుట్టింది. సులోచనను తండ్రి ఎంతో గారాబంగా పెంచుతూ వచ్చాడు. అయితే, తనకు మగసంతతి ఎవరూ లేకపోవటంవల్ల తన తదనంతరం పిల్లల క్షేమం కనుక్కొనేవాళ్లు లేరుకదా అనే పెద్దబెంగ పట్టుకుంది. ఈ బెంగతోటే రత్నాకరుడు మంచంపట్టి, కొన్నాళ్లకి చని పోయాడు.

తండ్రి చనిపోవడంతో సంసారభారం అంతా సులోచన నెత్తిన పడింది. తను పెళ్లిచేసుకున్నట్టయితే బ్రహ్మాండమైన ఆస్తి అంతా పరులపాలు అయిపోతుందనే జంకుతో, ఆమె వివాహం చేసుకోనేకూడదు అని నిశ్చయించుకొన్నది. పురుషులు ఆమె కంటపడకుండా వుండేవిధంగా ప్రత్యేకించి ఒక భవనం కట్టించుకుని అందులో ఉండసాగింది.

సులోచన క్షేమం కోరినవాళ్లందరూ ఆమెను పెళ్లిచేసుకొనుమని వత్తిడిచేయ నారంభించారు. వారి మాట తీసివేయ టానికా వీలులేదు. తనకా పెళ్లాడటం ఇష్టం లేదు. కనుక, బుద్ధిమతి ఐన సులోచన ఒక ఏర్పాటు చేసింది: "ఐదు ప్రశ్నలు వేస్తాను. వీటికి ఎవరైతే సరి ఐన సమాధానం చెప్పగలరో వారిని పెళ్లాడ తాను" అని ఆమె అనేసరకు, అందరూ బాగున్నదంటే బాగున్నదన్నారు.

ఈవార్త తెలిసి దేశదేశాలనించి పరాక్రమ వంతులైన రాజకుమారులు ఎంతోమంది వచ్చారు. వచ్చినవారంతా ఆమె వేసిన మొదటి ప్రశ్నకే 'జవాబు చెప్పటం మాతరం కాదు' అంటూ వచ్చినదారినే పోతూవచ్చారు.







కుమారుడైన ధీరసింహుడు సులోచనను చూడవచ్చి, ఆమె మొదటి ప్రశ్న ఏమిటో చెప్పమన్నాడు. అందుకు ఆమె "కొన్ని సంవత్సరాలుగా ఎక్కడినించో ఈ రాజ్యంలో 'ఒకసారి చూశానుగాని, మరి ఒకసారి చూడాలని వున్నది' అనేమాటలు వినిపిస్తూవున్నై. ఈ మాటలు ఎక్కడ నించి వస్తున్నవో వాటి అంతరార్థం ఏమిటో ఆ వివరాలు కావాలి" అని చెప్పింది. ధైర్యసాహసాలే జీవితంలో ప్రధానంగా పెట్టుకొన్న ధీరసింహునికి ఈ ప్రశ్న అసాధ్యమనిపించలేదు. అందుచేత తను తప్పక సమాధానం చెప్పగలనని నమ్మ బలికి, ఆమెవద్ద గడువు తీసుకొని తూర్పు దిక్కుగా బయల్దేరాడు.

ధీరసింహుడు పోయి పోయి ఒక కీకారణ్యం ప్రవేశించాడు. కొంతదూరంలో నక్కదంపతులు గొల్లుమని ఏడవటం విన పడింది. వాటివద్దకు వెళ్లి 'ఎందుకు ఏడుస్తున్నారు?' అని అడిగాడు ధీరసింహుడు. అందుకు అవి "అయ్యా! ఇక్కడికి ఒక కోసెడు దూరంలో ఒక కొండ, ఆ కొండలో ఒక గుహ, ఆగుహలో ఖడ్గమృగం అనేటటువంటి విచిత్రమైన జంతువు ఉన్నది. అది

సులోచనకు కావలసిందే ఇది. "అసాధ్యమైన ప్రశ్నలు ఇచ్చినట్టయితే ఎవ్వళ్లూ జవాబు చెప్పలేరుకదా. అటువంటప్పుడు నా నోటితో నేను అనకుండానే పెళ్లిసమస్య తప్పిపోతుందికదా. నా ఏర్పాటు సబబుగా వున్నప్పుడు నా క్షేమం కోరినవాళ్లుకూడా నాయందు తప్పు ఎంచలేరుకదా" అని ఆమె వుద్దేశం. ఈ ఉద్దేశంతోనే సులోచన కష్టాతికష్టమైన ప్రశ్నలు కల్పించింది.

చాలామంది రాజకుమారులు జవాబు చెప్పలేక తల వంచుకొని వెళ్లిపోయిన తరువాత చివరకు ఒకరోజున నేపాళ రాజ





మమ్మల్ని బతకనీయకుండా ముక్కుమీద ఉండే తన వాడికొమ్ముతో పొడిచి చంపుతూవుంది" అని చెప్పేవరకు ధీరసింహుడు తక్షణమే బయల్దేరి వెళ్లి ఆ గుహ చేరుకొన్నాడు.



అతను వెళ్లేసరికి ఖడ్గమృగం గాఢంగా నిద్రిస్తూవుంది. నిద్రిస్తున్న ప్రాణిని చంపడం పౌరుషవంతునికి తగదని తలిచి ధీరసింహుడు ఆ గుహ బయటికి వచ్చి ద్వారం ప్రక్కనేవున్న ఒక చెట్టుపైన పొంచి వున్నాడు. మరి కొంత సేపటికి ఖడ్గమృగం లేచి గుహలోంచి బయటికి రాసాగింది. ధీరసింహుడు అమాంతం దాని మీదికి దూకి, తను తెచ్చుకొన్న గొడ్డలితో దాని తల బ్రద్దలు కొట్టాడు. ఖడ్గమృగం గిలగిల తన్నుకుని చచ్చింది.

ధీరసింహుని సమయోచితానికీ సాహసానికీ సంతోషించి నక్కదంపతులు "రాజకుమారా! నీ ఉపకారం మేమెన్నటికీ మరచిపోలేము. మావల్ల నీకు కావలసిన సాయం ఏమిటో చెప్పు. చేతులు కట్టుకుని చేయటానికి సిద్ధంగా ఉన్నాము" అనే వరకు అతను తను బయల్దేరి వచ్చినపని నక్కదంపతులతో చెప్పాడు.

నక్కదంపతులు "నీవంటి సాహసికీ, యుక్తిశాలికీ, ఉపకారికీ అసాధ్యమనేది లేదు. నీకు తప్పక జయమవుతుంది" అంటూ కృతజ్ఞతను తెలిపి, అడవి దాటే వరకూ అతనివెంట వెళ్లి అక్కడనించి ఎడమచేతివేపు వెళ్లుమని సలహా చెప్పినై.

కార్యదీక్షగల ధీరసింహుడు కాళ్ళు కాలుతూవున్నప్పటికీ లెక్కచేయక, మండుటెండలో చాలదూరం నడచివెళ్లాడు. కొంతసేపటికి అలసట వచ్చి, ఒక చెట్టు నీడని చతికిలబడ్డాడు. అప్పుడు అతనికి ఎదురుగా రెండు పాములు కనబడినై. పెద్దపాము చిన్నపామును చంపబోతున్నది.









ఈ అన్యాయం చూచి ధీరసింహుడు, చిన్నపామును రక్షించువామనే వుద్దేశంతో పెద్దపామును తన బాణంతో కొట్టబోయే వరకు, ఆ రెండుపాములూ అదృశ్యమై, వాటికి బదులుగా ఇద్దరు గంధర్వులు ప్రత్యక్షమయ్యారు.

'మీరు ఎవరు? ఎందుకు ఇలా కొట్లాడుతున్నారు?' అని ధీరసింహుడు అడిగాడు.

'ఓయి రాజకుమారా! మేము చిన్నప్పటినించీ బద్ధశత్రువులం. నేను ఒంటపాటుగా ఉండటం చూచి, నన్ను ఇతను హింసిస్తున్నాడు' అంటూ చిన్న గంధర్వుడు చెప్పాడు.

అప్పుడు ధీరసింహుడు వారిద్దరికీ సుద్దులుచెప్పి, రాజీ కుదిర్చేవరకు, వారు అమితంగా సంతోషించి, "రాజకుమారా! ఇన్నేళ్ళబట్టి మామధ్యని ఉంటున్న వైరం పోగొట్టినందుకు నీకు ఎంతయినా కృతజ్ఞులం. నీకు మేము చేయగల సహాయమేదైనా వుంటే చేసి, కొంతవరకైనా ఋణం తీర్చుకుంటాము, చెప్పు" అంటూ, అతని ఎదట చేతులుజోడించి నించున్నారు.

ధీరసింహుడు తను వచ్చినపని వెల్లడి చేయగా, "ఈప్రశ్నను గురించి మేమూ విన్నాము. దీనికి జవాబు చెప్పటానికి నిజంగా నీవే తగినవాడవు. కొంచెం ముందుకవెళ్ళి, కుడివైపు మళ్ళినట్లయితే ఒక కొలను కనిపిస్తుంది. ఆ కొలను చేరుకున్నావంటే, తరువాత ఏమి చెయ్యాలో సులువుగా తెలుస్తుంది. నీకు తప్పక జయం కలుగుతుంది" అనిచెప్పి, గంధర్వులు కొలనుకు దారి చూపించారు.

దీక్షాపరుడైన ధీరసింహుడు గంధర్వులు చెప్పిన దారినే వెళ్ళి కొంచెంసేపటికల్లా కొలను చేరుకున్నాడు. విశ్రాంతికొరకు అతను గట్టుమీద కూర్చునేసరికి, కొలను లోపలినుంచి అపురూపసుందరమైన









ఒక నాగకన్య వచ్చి, ధీరసింహుని చేయి పట్టుకొని లోపలకు తీసుకుపోయింది.

లోపల ఒక రమణీయమైన తోట ఉన్నది. కనుపండువుచేసే ఆ పచ్చటి చెట్ల మీద రకరకాల ఫలములు పండి సిద్ధంగా ఉన్నాయి. ఆ ప్రదేశంలో మధ్యమధ్యాని సెలయేళ్ళు గానం చేసుకొంటూ ప్రవహిస్తున్నాయి. నేలంతా పచ్చలతో తాపటంచేసినట్టుంది. వృక్షాలన్నీ బంగారు రంగుతో మిలమిల మెరసిపోతున్నాయి. ఇవి దాటుకొనిపోగానే ఒక దివ్య భవనం కనిపించింది.

ధీరసింహుణ్ణి ఆ భవనంలోకి తీసుకుపోయింది నాగకన్య. అక్కడ ఒక పెద్ద హాలు. ఆ హాలు మధ్యనుండేనవరత్నఖచితమైన సింహాసనంమీద కూర్చోబెట్టింది. హాలు నాలుగువైపులా గోడలకు అందమైన రాజకుమార్తెల పటాలు వేలాడుతున్నాయి. ఒక చోటమాత్రం ఒక పటానికి సరిపడేటంత ఖాళీస్థలం కనపడింది. అతను ఈ పటాలు వింతగా చూస్తున్నంతలో తనను ఆహ్వానించిన నాగకన్యకూడా ఒక పటంగా మారిపోయి, ఆ ఖాళీ జాగాను పూర్తిచేసింది. ఇప్పుడు ఆ హాలులో ధీరసింహుడు తప్ప



మరెవ్వరూ లేరు. అతనికి చాల ఆకలి వేసేవరకు, గద్దె దిగి తోటలోకి వెళ్ళాడు. ఆ తోటలో ఎన్నిరకాల పండ్లు కోసుకొని తిన్నా ఆకలి తీరలేదు. అక్కడి సెలయేళ్ళలోని నీళ్ళు ఎన్ని తాగినా దాహం తీరలేదు.

అప్పటికి చీకటి పడినందువల్ల అతను మళ్ళీ దివ్యభవనంలోకి వెళ్ళాడు. అతను వెళ్ళేసరికి దీపాలు వాటంతట అవే వెలిగినై. గోడలను వేలాడుతూవున్న పటాలన్నీ నిజమైన కన్యలుగా మారిపోయి, వారందరూ ధీరసింహుని చుట్టూ చేరి గానంచేస్తూ, నృత్యంచేయసాగారు. ఆ రాత్రల్లా వారు నృత్యంచేశారు. తెల్లవారేసరికల్లా ఆ కన్య










లందరూ మళ్ళీ పటాలలో బొమ్మలుగా మారిపోయి, గోడలకు వేళ్ళాడసాగారు.

అటుతరువాత అక్కడనే వున్న గోడ కన్నంలోనుంచి చీమలబారు పాకుతూ బయటకు రావడం కనపడింది, ధీర సింహునికి. అతను కన్నండగ్గరకు వెళ్ళి, గోడను తట్టేవరకు అక్కడ బోలుగా ధ్వనించింది. ఆ గోడను కత్తితో పొడిచి బద్దలగొట్టేసరికి, ఒక అరా, అందులో ఒక పాత తాళంచెవీ కనపడింది. దానితో భవనంలోని ప్రతిగదివరకూ వెళ్ళి తెరవబోయాడు. కాని అది ఏగదికీ పడలేదు. దానితో చివరనుండే చిన్నగదిమాత్రం తెరవగలిగాడు. అతను ఆ గదిలో ప్రవేశించి చూడగా అక్కడ ఒక ఇనుపపెట్టెమాత్రం ఉన్నది. ఆ పెట్టె తాళంచెవి ఎక్కడైనా దొరుకుతుందేమోనని అతను ఆ చోటంతా వెతికాడు. కాని ఎక్కడా తాళంచెవి కనిపించకపోయేసరికి ధీరసింహుడు నిరాశ చెంది మరలిపోతూవుండగా అతని కాలు నేలమీద ఉన్న ఒక మీటమీద పడింది. కాలు మీటమీద పడీపడటంతోనే ఇనుపపెట్టె గభీమని తెరచుకున్నది. అప్పుడు ధీరసింహుడు ఆ ఇనుపపెట్టెలో ఏమున్నదో అని చూచాడు. దాంట్లో ఒక రాగిరేకు తప్ప మరేమీలేదు.

ఆ రాగిరేకుపైన ఇలా వ్రాసి ఉన్నది:
"ఇదంతా మాయ. ఎవ్వడైతే ఈ తోట మధ్యని ఉన్న బంగారు చెట్టును పెళ్లగిస్తాడో అతను ఈ మాయను తెలుసుకోగలుగుతాడు."

ఇది చూడగానే ధీరసింహుడు ఉత్సాహంతో తోటలోకి వెళ్లాడు. రాగిరేకుపైన వ్రాసివున్నవిధంగా బంగారు చెట్టు ఆ తోట మధ్యలో కనిపించింది గాని అతను దాన్ని పెల్లగించలేకపోయాడు. మళ్లీ నిరాశ చెంది, వెనుకకు తిరిగి పోబోతూవుండగా





అ చెట్టు పక్కనే అటువంటిదే ఒక చిన్న బంగారు చెట్టు అతనికి కనిపించింది. బహుశా రాగిరేకుపైన వ్రాసివున్నది ఈ చిన్నచెట్టు గురించేనేమో అనుకుని ధీర సింహుడు చిన్న చెట్టును పెల్లగించాడు. చిన్నచెట్టు పెల్లగించటంతోటే పెళా పెళా ధ్వని చేసుకుంటూ పెద్ద చెట్టు దానంతట అదే పడిపోయింది. ఈ పెద్ద ధ్వనికి ధీర సింహుడు స్పృహతప్పి పడిపోయాడు.



కొంతసేపటికి తెలివివచ్చి కళ్లుతెరచి చూడగా, అక్కడ తోటా లేదు. మేడా లేదు. పటాలలో వేలాడుతూవున్న నాగ కన్యలు మళ్లీ బిలబిలమంటూ వచ్చి అతన్ని చుట్టుముట్టారు. అప్పుడు ధీర సింహుడు "మీరు ఎవరు? ఈ మాయ అంతా ఏమిటి?" అని వారిని ప్రశ్నించాడు.

అందుకు వారు, "ఇక్కడికి పది యోజనాల దూరంలో ఉన్న మాయావతీ పట్టణ రాజకొమార్తెలం. మాకు యుక్త వయసు రాగానే, పెళ్ళిచేయుమని మేము మా తండ్రిని కోరగా, అయన మాపైన కోపగించి మమ్మల్నందరినీ ఈ భవనంలో బంధించాడు. 'అయితే మాగతి ఇంతేనా?' అని అడిగేవరకూ, 'మిమ్మల్ని ఎవడైతే ఈ మాయనుంచి విడిపించగలడో వాడే మీకు తగిన వరుడు. అటువంటి సమర్థుడు లభించేవరకు కనిపెట్టుకొని ఉండి, వివాహ మాడవచ్చు' అంటూ సలహా ఇచ్చాడు. ఈ మాయను తెలుసుకోగలిగిన పురుషుడివి నీ వొక్కడివే ఈనాటికి కనపడ్డావు. కనుక, మమ్మల్ని పెళ్లాడవలసింది" అని కోరారు.

వారి కోరిక విని ధీరసింహుడు "ఓ నాగకన్యల్లారా! మీకథ తెలిసి సంతోషించాను. కానైతే, నేను ఇప్పుడు ఒక ముఖ్యమైన రాచకార్యంలో మునిగి వున్నాను. అందుచేత పెళ్ళిసంగతి తలచటానికే వ్యవధిలేదు. కాబట్టి మీరు మరెవరి





నైనా చూచుకొని వెళ్ళాకండి" అనిచెప్పి తనవారిన బయలుదేరాడు.

కాని, ఇంత నిష్కర్షగా చెప్పినప్పటికీ, నాగకన్యలు అతనిని వదలలేదు. వారు కూడా ధీరసింహుని వెంట పోసాగారు. అలా ముందు ధీరసింహుడూ అతనివెనుక నాగకన్యలూ కొంతదూరం పోయేసరికి "ఒకసారి చూచానుగాని, మళ్ళీఒకసారి చూడాలనివున్నది" అనే మాటలు వినిపించినై. ఈమాటలు వినిపించగానే నాగకన్యలుమాత్రం వెంటనే తిరిగి తమ భవనానికి మరలిపోయారు. కాని ధీరసింహుడు ఏదిక్కునించి ఈ మాటలు వచ్చినయ్యో ఆ దిక్కుకుపోయి చూచేవరకు దీనావస్థలో ఉన్న ఒక రాజకుమారుడు కనిపించాడు.

"ఎవరు నువు అబ్బాయీ, ఎందుకలా విచారిస్తున్నావు?" అని అతనిని అడిగాడు.

ఆ రాజకుమారుడు, "ఈ మాయా మందిరంలో ప్రవేశించిన వాళ్ళలో నేనొకణ్ణి. అక్కడ ఉండే నాగకన్యలలో ఒకామెను ప్రేమించాను. కాని, ఆ భవనం బయటికి వచ్చినతరువాత మళ్ళీ అందులో ప్రవేశించటానికి దారీ తెన్నూతెలియలేదు. నా కోరిక తీరని కోరికగా నిలిచిపోయింది" అని తన కథ వినిపించాడు.

అప్పుడు ధీరసింహుడు ఆ రాజకుమారుణ్ణి వెంటబెట్టుకొని, నాగకన్యలు ఉండే భవనంలోకి తీసుకెళ్లి, తన ప్రజ్ఞవల్ల ఆ రాజకుమారుడు ప్రేమించిన నాగకన్యతో పెళ్లి ఏర్పాటు చేసి, పుణ్యంకట్టుకున్నాడు.

తరువాత అతను సులోచనవద్దకు పోయి, మాయామందిరాన్నిగురించిన చిత్రాలన్నీ చెప్పేవరకు, "అవును నా ప్రశ్నకు ఇదే జవాబు. ఇప్పుడు అమాటలు వినిపించటంలేదు కూడాను" అని ఆమె వప్పుకొని, "సరే, రెండవప్రశ్న చెబుతాను. రేపు రావలసింది" అని చెప్పి అతన్ని సాగనంపింది. (ఇంకా వుంది)









మరునాడు ధీరసింహుడు వెళ్ళగానే, అతనిని కూర్చోబెట్టి సులోచన తన రెండవ ప్రశ్న చెప్పనారంభించింది: "ఇక్కడికి పడమటిదిక్కున పదియోజనాల దూరంలో ఒక నది ప్రవహిస్తున్నది. అది ఎల్లప్పుడూ రక్తంవలె ఎర్రగా ఉంటుంది. అది ఎక్కడ పుట్టిందో, ఎర్రగా ఎందుకు ఉన్నదో, ఆ వివరాలన్నీ కావాలి" అని అనేవరకు, ధీరసింహుడు మళ్ళీ గడువు తీసుకొని, ఉత్సాహంతో బయల్దేరాడు.

అతను చాలాదూరం నడచివెళ్ళగా, రక్తనది కనిపించింది. ఆ నదిని చూచి అతనికి ఆశ్చర్యం వేసింది. నది గట్టునే ఎంతోదూరం నడవగా నడవగా ఒక భయంకరమైన అరణ్యం తగిలింది. అనేక భయోత్పాతాలు గడచి, ధీరసింహుడు ఎలా అయితేనేం, అరణ్యం చివరకు చేరుకొన్నాడు.

అక్కడ ఒక పర్వతంపైనుంచి రక్త నది ప్రవహించటం గమనించి, మెల్లగా ఆ కొండ యెక్కాడు. కొండశిఖరం చేరుకొనే వరకు, ఒక చిత్రమైన దృశ్యం కంటబడింది. ఒక పెద్ద కొలను, ఆ కొలను మధ్యని ఒక చెట్టు, ఆ చెట్టు కొమ్మలకు ఒక వంద స్త్రీ శిరస్సులు వేలాడుతున్నయి. అతను అమితాశ్చర్యంతో అక్కడనే కూర్చుని అటు చూస్తూవుండగా, ఆ శిరస్సులు ధీరసింహుణ్ణి చూచి పకపకా నవ్వసాగాయి.

ఇంతలో చీకటిపడింది. కాని, వెంటనే మాయవెలుతురు ఆ ప్రదేశమంతటా నిండి, పట్టపగలువలెనే ఉన్నది. చెట్టుకొమ్మల నుంచి వేలాడుతూవున్న శిరస్సులన్నీ ఒకటొకటిగా కొలనులోకి జారినై. చిటిక సేపటిలో, ఆ శిరస్సులెన్ని ఉన్నాయో సరీగా అంతమంది స్త్రీలు కొలను గట్టు







14

చేశారు తెల్లవారేసరికల్లా ఆ కన్యలందరూ మళ్లీ శిరస్సులుగా మారి, ఎప్పటివలె చెట్టు కొమ్మలను వేలాడసాగారు.

ఇంతగా తనను ఆదరించిన ఆ కన్యలు చెప్పకపోతారా అనే నమ్మకంతో, 'ఈ రక్తనది ఏమిటి? శిరస్సులేమిటి?' అని అతను వారిని ప్రశ్నించాడు. కాని వారు, ఎన్నిసార్లు అడిగినా, 'ఇదంతా మాయ' అనిమాత్రం చెప్పి ఊరుకొనేవారు. చీకటి పడగానే ఆ శిరస్సులు కన్యలుగా మారటం, ధీరసింహునికి విందుచేసి అతన్ని నృత్యగీతాదులతో తన్మయుణ్ణిగా చేయటం, తెల్లవారేసరికి కన్యలు మళ్ళీ శిరస్సులుగా మారిపోయి, చెట్టుకొమ్మలను వేలాడటం ఇలానే ప్రతీరోజూ జరుగుతూవున్నది. కాని ధీరసింహుడు ఎంత ప్రాధేయపడినా, వారు రహస్యంమాత్రం వెల్లడిచేయలేదు.

దీక్షాపరుడైన ధీరసింహుడు, ఈ రహస్యం ఎలా తెలుసుకోగలమా అని తీవ్రంగా ఆలోచించుకుంటూ, రాత్రీ పగలూ అనేక కొండలు దాటి పోతూ వుండగా, ఒక కొండగుహలో తపస్సులో వున్న ఋషీశ్వరుడు కనిపించాడు. తను వచ్చినపని ఈ మహానుభావునివల్ల నెరవేరి

మీదికి వచ్చారు. అంతమందిలోనూ ఒకామె మాత్రం చుక్కలలో చంద్రునికి మల్లే అపరూపసౌందర్యముతో ప్రకాశిస్తున్నది.

కొంచెంసేపట్లో, కొలువుతీర్చి కూర్చుని వున్న ఆ స్త్రీలకు పరిచారికలు పంచభక్ష్య పరమాన్నములు పట్టుకవచ్చి వడ్డించారు. ఆస్త్రీలు ధీరసింహుణ్ణి తమ బంతికి పిలవగా, అతను వెళ్ళాడు. అందరూ కలిసి ముచ్చటలు చెప్పుకొంటూ, సరదాగా భోజనాలు చేశారు. తరువాత వారు ధీరసింహుని చుట్టూ మూగి, తెల్లవారిందాకా నృత్యగీతాదులతో అతన్ని పరవశుని





తీరుతుందని ధీరసింహునికి మనస్సులో తట్టింది. మూడు రాత్రుళ్ళు, మూడు పగళ్ళు అతను అలానే కదలక కూర్చుండే వరకు. నాలుగో రోజున ఋషి కళ్ళు తెరచి ధీరసింహుని పలకరించాడు.

ధీరసింహుడు తన వృత్తాంతం అంతా చెప్పేసరికి, ఋషి అతనితో "ఓయి, ధీరసింహా! నీకు కనబడిన స్త్రీలలో అందరికంటే అందమైన కన్య, కమలాకరుడనే ఒక ఇంద్రజాలికుని కూతురు. యుక్త వయస్సులో అమె తనకు పెళ్ళి కావాలని కోరింది. కాని తండ్రికి ఇష్టంలేక, ఆమె పైన కోపించి ఈ మాయ నంతటినీ సృష్టించి, చెలికత్తెలతోసహా కూతురును బంధించివేశాడు. ఈ మాయను ఎవరైనా భేదించి, కమలాకరుణ్ణి చంపగలిగితే వాళ్ళకు ముక్తి ఉన్నది. లేకపోతే వారి గతి అంతే," అని చెప్పాడు.

ఇదివిని ధీరసింహుడు "మునీశ్వరా! తమదయ ఉంటే, నేను ఇంద్రజాలికుని చంపివేసి, ఆ స్త్రీలకు ముక్తిమార్గం చూపిస్తాను," అనేవరకు, ఋషి "అబ్బాయీ! ఇందుకు నీవు తగినవాడవని నాకు ముందే తెలుసు. నేను చెప్పబోయే మంత్రాన్ని




జపించినంత కాలమూ నీమీద ఏ మాయలూ పనిచేయవు. నీకు విజయమవుతుంది, వెళ్ళు" అంటూ, ఒక రహస్య మంత్రం ఉపదేశించాడు. మునీశ్వరునికి భక్తితో నమస్కరించి, ధీరసింహుడు రక్త నది ప్రవహించే పర్వతంవేపు పోసాగాడు.

కమలాకరుడు సృష్టించిన ఆ పర్వతమూ మాయపర్వతమే. దానిమీద చెట్లు మున్నూట అరవై రోజులూ పచ్చగానే ఉంటాయి, పూలచెట్లు ఏటి ఏడాదీ పూస్తూనే వుంటాయి. ధీరసింహుడు కొంత మీదకు పోయేసరికల్లా మాయ పులులూ, మాయసింహాలూ గాండ్రుపెడుతూవచ్చి







అతని పైనబడి మింగబోయినై. ఆ మాయ పర్వతంమీద నించున్న ధీరసింహుని కాళ్ళు సూదంటురాయికివలె అంటుకు పోయి, నేలనుంచి ఊడిరాలేదు. అప్పుడు ధీరసింహుడు గురువును తలచుకొని ఒక్క సారి మంత్రం జపించేవరకు, ఎక్కడి జంతువులు అక్కడనే అదృశ్యమైపోయినై. అతని కాళ్ళు నేలమీదినుంచి ఊడివచ్చి, మామూలుగా నడవగలిగాడు.

కమలాకరుడు తన మాయకోటలో కూర్చుని, పుస్తకం తెరచి చూచేటప్పటికి, తను సృష్టించిన మాయను భేదించటానికి ధీరసింహుడు వస్తున్నాడని తెలిసింది. వెంటనే అతను, సరీగా తన కుమార్తెను పోలిన ఒక మాయస్త్రీని సృష్టించి, చెలికత్తెలతో సహా ధీరసింహునివద్దకు పంపాడు. అక్కడ వాళ్ళు అనేకవిధాల నాట్యంచేసే వరకు, అతను 'ఇదేమిటి! ఇప్పుడు చెట్టు మీద కనిపించిన ఈ కన్యలందరూ అప్పుడే ఇక్కడకు ఎలా వచ్చారు!' అని ఆశ్చర్యపోయాడు.

ఆ మాయకన్యలు వారి నాట్యంతో ధీరసింహుణ్ణి ఆకర్షించి, అతను సంతోషంగా ఉన్న సమయంచూచి అతనిచేత రకరకాల పానీయాలూ తాగించి, అతను మత్తులో ఉండగా బంధించి కమలాకరుని వద్దకు తీసుకపోయారు.

పూర్వకాలంలో హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని బాధలు పెట్టినట్టుగా, ధీరసింహునికి కమలాకరుడు అనేక కష్టాలను కలగజేశాడు. జ్వాలలు ఎగసివచ్చే మంటలలో పడవేయించాడు. ఎత్తయిన పర్వతం మీదినించి కిందికి దొర్లించాడు. ధీరసింహుడు గురువును తలుచుకొని మంత్రం జపించటంవల్ల మంటలలో పడవేసినా ఒళ్ళు కాలలేదు. కొండమీదినించి దొర్లించినా కొంచెంకూడా దెబ్బ తగలలేదు.





17

చేసేది లేక, కమలాకరుడు అతనిని బందిఖానాలో పెట్టివుంచాడు. బుద్ధిశాలి అయిన ధీరసింహుడు, సుధాకరుడనే కాపలావాణ్ణి వశపరుచుకొని, "ఓయి అబ్బాయీ! నన్ను చెరవిడిపించినావంటే, కమలాకరుణ్ణి సంహరించి నిన్ను అతని రాజ్యానికి పట్టం కడతాను" అనేవరకు, ధీరసింహుని ప్రజ్ఞ ఇదివరకే తెలిసికొని వున్న సుధాకరుడు అతనిని ఖైదునించి తప్పించివేశాడు.

తెల్లవారేసరికి ధీరసింహుడు జైలులో నుంచి తప్పిపోయిన వార్త ఊరంతా వ్యాపించి, కమలాకరుని చెవినిపడింది. వెంటనే అయన పుస్తకం తెరచిచూచి, ముందు జరుగబోయేదంతా తెలుసుకొని, ధీరసింహుణ్ణి పట్టి తీసుకరమ్మని అజ్ఞాపించాడు.

ఈ సంగతి తెలిసి, సుధాకరుడు తక్షణమే పోయి ధీరసింహుని శరణుజొచ్చాడు. ధీరసింహుడు అతనితో "నీకు వచ్చిన భయంలేదు" అని ధైర్యంచెప్పి, కమలాకరుని నివాసమును గురించిన రహస్యాలు అడిగేవరకు, అతను ఇలా చెప్పాడు:



"కమలాకరుడు నాస్తికుడు. క్రూరుడు. అసాధ్యుడు. అతను ఉండటానికి ఈ మాయ కోటమాత్రమే గాక, ఈశ్వరుణ్ణి జయించటానికి ముప్ఫయివేల అడుగుల ఎత్తున ఒక మాయ ఆకాశం నిర్మించి, అందులో సూర్య చంద్రుల్నీ, నవగ్రహాలనూ సృష్టించాడు. శత్రువు తనపైకి దాడి వచ్చినప్పుడు, ఇంద్రజిత్తు మోస్తరుగా, కోట వదలి మాయ ఆకాశంలోకి పోయి దాగుంటాడు. కనుక అతన్ని జయించటం ఎవరికీ సాధ్యం కావటంలేదు "అని.

ఇది విని ధీరసింహుడు "సుధాకరా! దైవాన్ని నమ్మినవాళ్ళకు అసాధ్యమనేది








లేదు. అతని కోటకు దారి చూపించు. తరువాత సంగతి చెబుతాను" అంటూ, సుధాకరుణ్ణి వెంటబెట్టుకొని అతను బయల్దేరాడు. దోవలో చిత్రమైన చెట్లు ఎన్నో కనిపించినై. వాటిని గురించి ధీరసింహుడు అడిగేవరకు, "ఇవి నిజమైన చెట్లు కావు. కమలాకరుని మాయవల్ల మనుషులే ఇలా మారిపోయారు" అని సుధాకరుడు చెప్పాడు.

గురువును తలుచుకుని, ధీరసింహుడు ఒక్కసారి మంత్ర జపించగానే, ఆ చెట్లన్నీ మళ్ళీ మనుష్యులుగా మారిపోయి, ధీరసింహుని వెంట బయల్దేరారు.

18



ధీరసింహుడు తనమీదికి వస్తున్నాడని తెలుసుకొని, కమలాకరుడు యుద్ధం చేయటానికి సిద్ధపడి అప్పటి కప్పుడే కొత్త కొత్త మాయలు ప్రారంభించాడు. అతని మాయలకు భూమి కంపించసాగింది. కటికచీకటి అలుముకొన్నది. అందుచేత ధీరసింహుని వెంటనున్న పరివారమంతా భయపడి కేకలు పెట్టారు. ధీరసింహుడు గురువును తలచుకొని మంత్రం జపించేవరకు, చీకటి విచ్చిపోయి మళ్ళీ వెలుగువచ్చేసింది, భూమి కపించటం మానివేసింది.

కోపం కొద్దీ కమలాకరుడు ఆగ్నేయాస్త్రం వేసి, ఎగసివచ్చే మంటలను పంపించాడు. ధీరసింహుడు వారుణాస్త్రం ప్రయోగించి వర్షం కురిపించి, ఆ మంటలను ఒక్క క్షణంలో చల్లార్చాడు. అప్పుడు కమలాకరుడు. ఒక పెద్ద మాయపర్వతాన్ని ధీరసింహుని మీదకు వదిలాడు. అది తనను తాకక ముందే ధీరసింహుడు తీవ్రంగా జపించేవరకు, మంత్ర మహిమవల్ల ఆ పర్వతం వెంటనే తిరిగిపోయి కమలాకరుని సేననే హతమార్చించి. కమలాకరుడు మాత్రం కాస్తంతలో చావుతప్పి, బతికాడు. చివరకు కసికొద్దీ కమలాకరుడు మాయ





19

సర్పాలను వదిలిపెట్టాడు. ధీరసింహుడు గురువును తలచుకొని గాఢమైన గారుడాస్త్రం ప్రయోగించేవరకు, ఆ మాయ సర్పాలన్నీ ఎదురుతిరిగి, కమలాకరుని సైన్యాన్నే కాటువేయ జొచ్చినై.

ఇక ధైర్యం చాలక, కమలాకరుడు తన మంత్రశక్తివల్ల అదృశ్యమై పోయాడు. ఇది చూచి, మిగిలివున్న సైన్యమంతా ధీరసింహుని పక్షం చేరిపోయింది.




కమలాకరుడు తన మాయ ఆకాశంలో దాగివుంటాడని గ్రహించి, ధీరసింహుడు దీక్షతో జపించేవరకు, ఆ ప్రభావంవల్ల మాయ ఆకాశం ఫెళఫెళమంటూ విరిగి ఒక్కసారిగా కూలిపోయింది. కమలాకరుడూ, కొద్దో గొప్పో మిగిలిన అతని సైన్యం దాని కిందపడి చచ్చారు.

ధీరసింహుడు అనుచరులతోపాటు ఆనందంగా కోటలో ప్రవేశించేవరకు, అక్కడ ఎన్నో దివ్యమైన బంగారపు మేడలూ, అందమైన పూలతోటలూ కనపడినై. పోతే, అక్కడ ఉండే బజారులో దొరకని వస్తువంటూ లేదు. అదేం చిత్రమో గాని, ఆ వస్తువులు అమ్మడానికి మనుషులెవరూ కనిపించరు. ధీరసింహుని అనుచరులకు ఆకలి దహించుకుపోవటంచేత, కంటికి నిండుగా కనపడిన మిఠాయి దుకాణాలమీదికి వారు ఎగబడ్డారు. కాని, కొంచెంసేపటికే వాళ్ళందరూ గిరగిర కళ్ళు తిరిగి కింద పడిపోయారు.

వీరి స్థితిచూచి ధీరసింహుడు "ఓహో, ఈ మిఠాయి తిన్నందువల్లనే వీరు పడిపోయివుండాలి. ఇది బహుశా మాయ మిఠాయి కాబోలు!" అని తలచి, దగ్గరనే వున్న ఒక కొలనులోని నీళ్ళుతెచ్చి, మంత్రించి ఆ మంత్రజలం వారిపైన చల్లేవరకు, అందరకూ తెలివివచ్చింది. కల కాని లేచినట్టుగా, అందరూ గభీమని లేచి





కూర్చున్నారు. ధీరసింహుడు మంత్రజలం చల్లిన తరువాత ఆ ప్రదేశమంతా పవిత్రమై, కమలాకరుని మాయలు మచ్చుకైనా లేకుండా పోయినై. ధీరసింహుడు వాగ్దానం ప్రకారం సుధాకరునికి పట్టం కట్టాడు.

తరువాత, పర్వతం సమీపాన కొలను వద్దకు వెళ్లి, ఆ కన్యల శిరస్సులు వేలాడుతున్న చెట్టు చేరుకొన్నాడు. అక్కడ కూర్చుని, కొంతసేపు మంత్రం జపించే వరకు, సరోవరమూ లేదు, వృక్షమూ లేదు. కన్యలు మాత్రం ధీరసింహుని ముందు నిల్చుని వున్నారు.

అతను కమలాకరుని కూతురుతో "అమ్మాయీ! నీ తండ్రి చాలా దుర్మార్గుడు. నిన్నేగాకుండా నిరపరాధులైన ఎంతో మందిని అకారణంగా హింసించాడు. కనుక, అతన్ని చంపవలసి వచ్చింది. నీ కష్టాలు గట్టెక్కినై. నీ యిష్టం వచ్చిన వానిని వివాహం చేసుకొని సుఖంగా ఉండు" అని చెప్పి, వారినందరినీ కోటకు చేర్చాడు. ఇంద్రజాలికుని కూతురు సుధాకరుణ్ణే వరించి పెళ్లాడి, సుఖంగా ఉన్నది. అప్పటినించీ ఆ నదిలోని నీరు నీటికిమల్లే స్వచ్ఛంగా ఉంటూవుంది.

ధీరసింహుడు తనకు మంత్రం ఉపదేశించిన గురువువద్ద సెలవు తీసుకొని, సులోచన ఉండే నగరానికి బయల్దేరాడు. అతను వచ్చినట్టు తెలియగానే సులోచన రెండు కుర్చీలు వేయించి, ధీరసింహుణ్ణి ఎంతో గౌరవించింది. అతను సావకాశంగా తను చూచివచ్చిన వృత్తాంతం అంతా చెప్పగా, ఆమె సంతోషించి, "అవును. ఇప్పుడు ఆ నదిలో నీరు ఎర్రగా కాకుండా, నిర్మలంగా ఉన్నట్టు తెలిసిందికూడాను. నీవు చెప్పినవన్నీ యదార్థములే" అని ఒప్పుకొని, "రేపటిరోజున మూడవప్రశ్న చెబుతాను" అని చెప్పి ధీరసింహుణ్ణి సాగనంపింది. (ఇంకా వుంది)






రాజకుమారి చెప్పినప్రకారం ధీర సింహుడు వెళ్లి, "నీ మూడవప్రశ్న ఏమిటి?" అని అడిగాడు.

అందుకు సులోచన "ఇక్కడికి దక్షిణ దిక్కున శతయోజనాల దూరంలో ఒక శ్మశానంలోనించి రాత్రిపూట 'అయ్యో! ఉపయోగమైన పని ఏదీ చేయకుండానే, ఈ శుక్రవారంకూడా గడచిపోయిందే!' అనే కేక వినిపిస్తుంది. ఆ కేక ఎందుకు వినబడుతున్నదో, దాని అంతరార్థం ఏమిటో వివరాలు చెప్పాలి" అన్నది.

సరేనని చెప్పి ధీరసింహుడు సులోచన వద్ద గడువు తీసికొని, దక్షిణదిశగా బయల్దేరాడు.

ఒక కాలిబాటన బయలుదేరి అతను చాలదూరం నడచినడచి అలసిపోయాడు. కాస్సేపు విశ్రమిద్దామని ఒకచోట కూర్చొబోయేటంతలో, సమీపంలోనే ఒక నగరం కనిపించింది. లేనిబలం తెచ్చిపెట్టుకొని, ధీరసింహుడు మెల్లగా ఆ నగరం చేరుకొన్నాడు.

నగరంలో అడుగు పెట్టీ పెట్టడంతోటే, ఇద్దరు సిపాయిలు వచ్చి, అతన్ని చుట్టుముట్టారు. వాళ్లు చూడగా, మనవంటి మనుష్యులూ కారు, రాక్షసులూ కారు. దేవలోకానికి చెందిన ఒక జాతివాళ్లలాగా కనపడ్డారు. "ఓయి భటుల్లారా! నేనేం తప్పు చేశానని నన్ను పట్టుకొంటారు? నా పనిమీద నేను వెళుతూ, ఈ నగరంమధ్యనించి పోవలసివచ్చింది. కనుక, నన్ను పోనీయండి" అంటూ ధీరసింహుడు ప్రాధేయపడ్డాడు. కాని, అతని మాటలను వాళ్లు చెవిని పెట్టకుండా, సరాసరి తమ ప్రభువువద్దకు తీసుకపోయారు.

దర్బారులో రాజు సింహాసనమందు కూర్చునివున్నాడు. రాజు ఏదో బాధ







పడుతున్నట్టు ధీరసింహుడు గమనించాడు. భటులను చూడగానే రాజు "ఈయన ఎవడోయ్? ఎందుకు వచ్చాడోయ్?" అంటూ విసుగుతో ప్రశ్నించాడు.

అందుకు భటులు "మహాప్రభూ! ఇతను మన నగరంలో అడుగుపెట్టిన పరాయిదేశస్థుడండి. మన దేశాచార ప్రకారం ఉరి తీయటానికని తీసుకవచ్చామండి" అని అనేవరకు, మహారాజు మాటాడకుండా తలవంచుకున్నాడు. ఇంతలో ధీరసింహుడు సంగతి సందర్భాలన్నీ ఒక్క నిమిషంలో గ్రహించి, "మహారాజా! తమ రేవో భరింపరాని బాధ అనుభవిస్తున్నట్టు కనబడుతున్నది. ఏలిక సెలవైతే, ఒక్క వారంరోజులలో ఈబాధ నేను నివారణ చేయగలను. అయితే, ఈ వారంరోజులూ నేను తమవెంబడే ఉండి, కొన్ని లక్షణాలను కనిపెట్టవలసివుంది. ఇందుకు అనుమతించినపక్షమందు ఇప్పుడే చికిత్స ప్రారంభిస్తాను" అన్నాడు.

రాజు బ్రహ్మానందభరితుడై, వెంటనే అంగీకరించాడు. యుక్తిపరుడైన ధీరసింహుడు, రెండు రోజులపాటు రాజు సమక్షమందే ఉండి ఆయన అలవాటులన్నీ గమనించాడు, కాని, రోగానికి కారణమేమిటో అంతుపట్టలేదు. మూడవరోజున అతనికి మెరపువలె ఒక ఆలోచన తట్టింది.

ఆరోజున, అందరితోపాటు రాజు భోజనంచేస్తూవుండగా, మధ్యలో ధీరసింహుడు 'పిడికిలి విప్పండి మహారాజా!' అన్నాడు. అలా విప్పగా, తన చేతిలో మెతుకులకు బదులు గులక రాళ్ళు ఉండటం చూచి రాజు ఆశ్చర్యపోయాడు.

అప్పుడు ధీరసింహుడు "మహారాజా! ఇప్పుడు తెలుసుకొన్నారా, ఇన్నాళ్లనించి మీరు అనుభవిస్తున్న బాధకు కారణం? బంతిని కూర్చున్నప్పుడు వడ్డనలో పక్షపాత





బుద్ధి పనికిరాదు. అది మహాపాపం. కావాలెనంటే మీరు ఏకాంతంగా కూర్చుని మీ యిష్టంవచ్చిన పదార్థాలు ఆరగింపవచ్చు. కాని, నలుగురిలో మీరుమాత్రం మంచి పదార్థాలు తిని, తక్కినవారికి చవుకరకం వస్తువులు వడ్డించడంతో, ఆ పాపం మీకు చుట్టుకొని, మీరు ఆరగించే దివ్యపదార్థాలన్నీ ఈవిధమైన రాళ్ళుగా మారిపోయి మిమ్మల్ని బాధిస్తున్నాయి. దృష్టాంతం చూడాలెనంటే, బంతిలో పక్షపాతం లేకుండా సర్వ సమానంగా వడ్డింపించినా సరే, లేదా మీరు ఒక్కరూ వేరే కూర్చుని భోజనం చేసినాసరే, మీకు ఈ పాపం అంటదు, ఈ బాధ ఉండదు" అని అనే వరకు, రాజు అలానే చేసి చూచాడు. ఇందువల్ల ధీరసింహుడు చెప్పినట్టుగానే రాజు బాధ నయమైపోయింది.

ఇహపరసాధకమైన ఈ సలహాకు రాజు చాలా సంతోషించి. ధీరసింహుణ్ణి తన ఆస్థానంలో ఉండిపోవలసిందని బతిమాలాడు, కాని, ఆతను వప్పుకోలేదు. 'పోనీ, మీకు కావలసిన వరం కోరుకుని, నన్ను సంతోషపెట్టండి' అంటూ రాజు ఆతనిని భక్తిపూర్వకంగా అడిగేవరకు, "ప్రభూ








మీరాజ్యంలో అడుగుపెట్టిన పరదేశస్థులను నిష్కారణంగా ఉరితీయిస్తూవుంటిరే! ఇది ఎంతటి దుష్టశాసనం! ఎంత అవివేకం! ఎంత అనాగరకం! ఇప్పుడైనా కన్ను తెరచి, ఈ దుర్నయం నిలిపివేస్తే అదే పదివేలు. ఇంతకుమించి నాకోసమై నేను కోరతగినది ఏమీలేదు" అని మనసువిడచి చెప్పేవరకు రాజు తన తప్పిదానికి సిగ్గుపడి, అర్థంలేని ఈ క్రూర శాసనాన్ని వెంటనే రద్దుచేయించాడు.

రాజులో కలిగిన ఈ మంచి మార్పులకు సంతోషించి, ధీరసింహుడు తనదారిన తను బయల్దేరాడు. ఆతను పాపం, రోజల్లా మిటమిటలాడే మండుటెండలో ప్రయాణం చేసి, నీరూ నిప్పూ పుట్టని ఒక గడ్డు ఎడారి పట్టి పోజొచ్చాడు. ఆ మహా ఎడారిలో హఠాత్తుగా భయంకరమైన ఇసుక తుపాను రేగింది. ఆ తుపానులో మిక్కుటమైన గాలికి ఎంతో దూరం కొట్టుకుపోయి, అతను దక్షిణదిక్కున ఒక చెట్టుకిందికి విసరబడ్డాడు.

అతను 'అమ్మయ్యో!' అని కాలూ చేయీ సర్దుకునేటంతలో, ఆ సమీపంనించే "అయ్యో! ఉపయోగమైన పని ఏదీ చేయకుండానే, ఈ శుక్రవారంకూడా గడచిపోయిందే!" అనే కేక వినిపించింది. విశ్రాంతిమాట తరువాత చూచుకోవచ్చునని తలచి, ధీరసింహుడు "ఓహో! ఈ కేక నేను తెలుసుకోవలసిన కేకలాగానే ఉన్నది. నేను చేరవలసిన ప్రదేశం ఇదే అయివుండాలి" అని నిశ్చయించి, తక్షణమే ఆ కేక వినబడిన దిక్కుకి కాలు సాగించాడు.

పోగా పోగా ఒక పెద్ద శ్మశానం, అందులో అనేకమైన గోరీలు కనబడినై.

అందులోని ఒక గోరీనించి ఆ కేక వినవచ్చిందని ధీరసింహుడు తన బుద్ధిబలం





వల్ల తెలుసుకోగలిగాడు. తన వుద్దేశం నిజమవునో కాదో నిర్ధారణ చేసుకోవటాని కని, ఒక గోరీ వెనుక చిత్రం చూస్తూ అలానే నిలబడ్డాడు.

ఇంతలో టంగ్ టంగ్‌మని పన్నెండు గంటలు కొట్టేవరకు, గోరీలమీద నున్న మూతలు తెరచుకొని, మృతగాత్మలందరూ ఇవతలకు వచ్చి నిలుచున్నారు. వారందరూ మంచి విలువైన వస్త్రాలు ధరించారు. వారివద్ద గుమగుమ పరిమళములు కొడుతున్నయి. వేషం చూడగా, వారు శ్రీమంతులని చెప్పకనే తెలిసిపోతున్నది. తరువాత వారందరూ బంతులు తీర్చి కూర్చున్నారు.

అయితే, ఇంతమందిలోనూ ఒక్కడు మాత్రం మురికిగానున్న చింపిపాతలు కట్టుకుని, గర్భ దరిద్రునిలాగా కనపడుతున్నాడు. ఇతన్ని చూచి ధీరసింహునికి జాలివేసింది. మృతగాత్మలందరూ తీర్చి కూర్చోగానే, పంచభక్ష్య పరమాన్నాలతో నిండిన బంగారు పళ్లాలు వాటంతటఅవే ఒకొక్కళ్ల ఎదట ప్రత్యక్షమైనాయి.

వారందరకూ ఒకొక్క పళ్లెం సరిపడేటట్టు ఉండగా, పైన ఒక పళ్లెం మిగిలి








వున్నది. ఆ పళ్లెంవేపు చేయిచూపుతూ, ఆ మృతగాత్ములలోని ఒకవృద్ధుడు "ఓయి ధీరసింహుడా! ఈ పళ్లెం నీకోసమే ఏర్పాటు అయింది. కూర్చుని భోంచేయి" అన్నాడు.

సరేనంటూ, ధీరసింహుడు పళ్లెం ముందు కూర్చుని, ఒక్కసారి కలియ జూచాడు. అందరిముందూ పళ్లాలలో పంచభక్ష్య పరమాన్నములున్నై గాని, ఆ దరిద్రుని ముందున్న పళ్లెంలోమట్టికి రాళ్లున్నై. అందరి లోటాలలోనూ రుచికర మైన తెల్లటి పాలుండగా, వాని లోటాలో మాత్రం కంపుకొడుతూవున్న మురికి



నీళ్లున్నై. అందరూ లొట్టలు వేసుకొంటూ హాయిగా భోజనాలు చేస్తూవుండగా, వాడు మాత్రం దేవుడా అంటూ కళ్లు నులుము కొంటూ కూర్చున్నాడు.

అప్పుడు ధీరసింహుడు పక్కనున్న వానితో "ఏమయ్యా! ఇదేమి న్యాయం! మన తోడివానికి బంతిలో పలపక్షం చేయుటం ధర్మమేనా?" అని అడిగేసరికి "అయ్యా! అది దేవుని ఆజ్ఞ. దానిని తిప్ప టానికి ఎవరివల్లా కాదు" అని చెప్పాడు.

ఈ కీలక మేదో తెలుసుకోవాలనే పట్టు దలతో, అందరూ భోజనాలయి చేతులు కడుగుకునే సమయంలో ధీరసింహుడు గబగబ ఆ దరిద్రునివద్దకు వెళ్లి, "ఏమోయి నేస్తం! నీవు ఎవరవు? నీ దుస్థితికి కారణం యేమిటి?" అని అడిగేవరకు, అతను "అయ్యో! ఉపయోగమైన పని ఏదీ చేయకుండానే, ఈ శుక్రవారంకూడా గడచి పోయిందే!" అంటూ ఒక పెద్ద కేకపెట్టి, ఇలా చెప్పసాగాడు:—

"అయ్యా! ఇక్కడికి పదియోజనాల దూరంలో వున్న విశాలనగరంలో నే నొక గొప్ప వ్యాపారస్థుణ్ణి. నేను బోలెడంత ధనం ఆర్జించి, కోట్లకు పడగలెత్తాను. కాని,







ఎన్నడూ పిల్లికైనా బిచ్చంవేసిన పాపాన పోలేదు. ఇప్పుడు మీరు చూచినవాళ్లందరూ నా నౌకర్లు. వాళ్ల కష్టం తీసుకొని, జీతాలివ్వకుండా పీడించి, వాళ్ళను నానా తిప్పలు పెట్టాను. వాళ్లు కొద్ది ఆదాయం లోనే దానధర్మాలు చేసుకొని, పరమార్థ చింతతో జీవనం గడపటంచేత, ఈ లోకంలో వాళ్లు సౌఖ్యం అనుభవిస్తూ వున్నారు. నా పాపఫలం కొద్దీ నా నౌకర్ల ఎదటనే నేను నికృష్టజీవనం గడపవలసి వచ్చింది. నా పాపంవల్లనే నా కుమాళ్లు ముగ్గురూ, కోట్లకొద్దీ ధనం ఉండీకూడా, విడిశానగరంలో బిచ్చమెత్తుకోవలసిన గతి పట్టింది."

ఈ కథ వినగానే ధీరసింహుడు "మరైతే, నీవు ఆర్జించిన ధనమంతా ఏమయింది? నీ దుస్థితి తప్పించటానికి గత్యంతరం లేదా?" అని ఆత్రంతో ప్రశ్నించాడు.

అందుకు అతను "నీవు నాపట్ల అభిమాన ముంచి అడుగుతున్నావు గనక నిజం చెబుతున్నాను. నా ధనమంతా ఇంటి పెరడులో, తూర్పుదిక్కున ద్వారానికి సరిగా పది గజాల దూరంలో గొయ్యితీసి పాతిపెట్టాను.



ఈ రహస్యం నా కుమాళ్లతో చెప్పకుండానే నేను చనిపోయాను. ఇప్పుడు ఏ పుణ్యాత్ముడైనా విడిశానగరం వెళ్లి, నేను ఆర్జించిన ఆ పాపపు ద్రవ్యాన్ని నాలుగు భాగాలు చేసి, అందులో మూడువంతులు ధర్మ కార్యాలకు వినియోగించి, తక్కినది నా కుమారులకు సమంగా పంచిపెట్టగలిగితే, నాకు ఉత్తరగతులు కలిగి, నేనూ నా నవుకర్లతోపాటు స్వర్గసౌఖ్యాలు అనుభవించటానికి వీలవుతుంది" అని చెప్పాడు.

వెంటనే ధీరసింహుడు కష్టపడి విడిశా నగరం చేరుకొని, ఆ వ్యాపారస్థుని ఇల్లు కనుక్కొని, అతనికంటే మిక్కుటమైన

దరిద్రావస్థలో ఉన్న అతని కుమాళ్ళను కలుసుకొన్నాడు. 'నేను మీ నాయన వద్దనుంచి వచ్చాను' అని ధీరసింహుడు చెప్పగా, "ఇరవై ఏళ్ళకిందట చనిపోయిన మా నాయన ఏమిటి, నీకు కనబడట మేమిటి? విడ్డూరంగా వుందే!" అంటూ వాళ్లు పరిహాసంగా మాటాడారు.

అప్పుడు ధీరసింహుడు, వారి తండ్రి చెప్పిన సంగతులూ, ఆనవాళ్లూ చెప్పి, వారిని పెరట్లోకి తీసుకొని వెళ్లి వెతకి చూడగా, ధనం కంటబడేవరకు వాళ్ళు అతని మాటలు నిజమేనని నమ్మారు. తరువాత ధీరసింహుడు వర్తకుడు చెప్పిన ప్రకారం మూడువంతుల ధనం ధర్మ కార్యాలకు వినియోగించి, మిగిలింది వర్తకుని ముగ్గురు కుమాళ్లకూ సమంగా పంచిపెట్టాడు.

ఆ క్షణంనించీ ఆ కుమారులు ముగ్గురూ దరిద్రం పోయి, హాయిగా జీవిస్తున్నారు.

ధీరసింహుడు తిరిగి శ్మశానానికిపోయి చూచేవరకు, వర్తకుడు ఇప్పుడు తక్కిన మృతగాత్మలందరితో పాటు సుఖంగా జీవనం గడుపుతున్నాడు. అతను ధీరసింహుణ్ణి చూడగానే, తనకు జరిగిన ఉపకారానికి ఎంతో సంతోషం తెలుపుతూ, అతన్ని దీవించాడు.

ధీరసింహుడు ఆ వర్తకునివద్ద సెలవు తీసుకొని, తిరుగా కౌశాంబీ నగరం చేరుకొన్నాడు.

సులోచన అతన్ని గౌరవించి కూర్చొబెట్టి, అతను చెప్పినదంతా శ్రద్ధతో విన్నది. చివరకు, "నీవు చెప్పింది నిజమే. ఈ శుక్రవారంనాడు ఆ కేక వినబడటంలేదు కూడాను. నీ తెలివితేటలకూ ధైర్యసాహసాలకూ సంతోషించాను. రేపు వచ్చి, నాలుగో ప్రశ్న తెలుసుకుందువుగాని" అంటూ ఆమె ధీరసింహుణ్ణి సాగనంపింది.

[ఇంకా వుంది]





(4)




మరునాడు ధీరసింహుడు సులోచనవద్దకు వెళ్ళగా, ఆమె ఉచిత మర్యాదలతో అతన్ని కూర్చోబెట్టి, తన సమస్యచెప్పింది: "నైరుతి దిక్కున ఒక మాయస్నానాల గది ఉన్నది. దాని పుట్టుపూర్వోత్తరాలు నాకు చెప్పాలి" అనేవరకు, యథాప్రకారం గడువు తీసుకొని ధీరసింహుడు నైరుతి దిక్కుగా బయల్దేరాడు.

కొంతదూరం వెళ్లేవరకు అతనికి ఒక పట్టణం కనిపించింది. ఆ పట్టణం పొలిమేర దాటగానే ఒక బావి కనపడింది. ఆ బావిదగ్గర దుఃఖంతో వున్న ముసలి దంపతులు, వారిచుట్టూ మూగిన చాలా మంది జనం కనపడ్డారు. ఈ చిత్రం ఏమిటా అని ధీరసింహుడు అక్కడివాళ్లను అడిగేసరికి, "అయ్యా! ఈ ముసలివాళ్లకు ఒక్కగానొక్క కొడుకు. వారంరోజుల క్రిందట పాపం, అతనికి పిచ్చెత్తి, గభీమని ఈ బావిలో దూకాడు. పోనీ దూకినవాడు చచ్చాడని అనుకుందామా అంటే, ఇప్పటి వరకు వానిశవం పైకితేలలేదు. అందుకని, ముసలివాళ్ళు నిద్రాహారాలులేక ఇలా విలపిస్తున్నారు" అంటూ వారు చెప్పారు.

ధీరసింహుడు ఒక్క నిమిషమైనా ఆలస్యంచేయక, ఆ వృద్ధులతో "మీరు దుఃఖించక ఇక్కడనే వేచి ఉండండి. ఒక్క చిటికెలో మీ అబ్బాయిని తీసుక వచ్చి మీ ఎదట పెడతాను" అని చెబుతూనే బావిలోకి దూకాడు. అతని ఈ సాహసానికి అందరూ ఆశ్చర్యపోయారు.

అతను ఆ బావిలో దూకి, లోతుకంటా పోయేవరకు కాలికి నేల తగిలింది. ధీరసింహుడు ఆగి అటు యిటు చూడగా, ఒక రహస్య ద్వారం కనపడింది. ఆ ద్వారంగుండాపోయి అతను ఒక పూలతోట చేరుకొన్నాడు. తోటలో ఒక దివ్యభవనం





కనపడేసరికి, అతను ధైర్యంతో, ఆ భవనం ప్రవేశించాడు.

భవనం మధ్యని ఒక పెద్దహాలు ఉన్నది. హాలంతా దేదీప్యమానమైన మణి దీపాలతో వెలిగిపోతున్నది. అక్కడ చాలా మంది దేవతాస్త్రీలు కూర్చునివున్నారు. వారి మధ్య, చుక్కలలో చంద్రునివలె అపురూపసుందరమైన ఒక రాజకుమారి, అమె ప్రక్కన ఒక చక్కటి రూపసిఐన యువకుడూ కూర్చొనివున్నారు. రాజ కుమారి దేవతాస్త్రీయే, కాని యువకుడు మాత్రం మానవజాతికి చెందినవాడు. ఈ యువకుడు ముసలిదంపతుల కుమారుడే ఐవుంటాడని ధీరసింహుడు వెంటనే గ్రహించి. ఆ యువకుణ్ణి పేరుపెట్టి పిలచి, "అబ్బాయీ! నీ తలిదండ్రులు పాపం నీకొసం ఒక్కపెట్టుగా శోకిస్తూవుంటే, నీ విక్కడ విలాసాలతో ఇలా కాలం గడపటం న్యాయమేనా?" అని అడిగే వరకు. యువకునికి తన తలిదండ్రుల సంగతి జ్ఞాపకంవచ్చి, సిగ్గుతో తల వంచుకొన్నాడు.

అప్పుడు ధీరసింహుడు జాలిపుట్టించే మాటలతో ఆ ముసలి తలిదండ్రుల స్థితిని








వర్ణించి చెప్పేవరకు రాజకుమారి మనస్సు కరగిపోయి, యువకుడు తలిదండ్రులను చూచి రావటానికి అనుమతించింది. ధీర సింహుడు యువకుణ్ణి వెంటబెట్టుకువస్తూ, 'అబ్బాయీ! అసలు నీవు ఈ బావిలో ఎందుకు దూకావు?' అని అడిగేవరకు, అతను యిలా చెప్ప నారంభించాడు:

"ఒకనాడు నేను బావిదగ్గర నిలబడి వుండగా, బావిలో దేవతాస్త్రీలు కనిపించారు. అప్పటినుంచీ నాకు పిచ్చెత్తినట్టయి. ఉండ లేక ఒకరోజున అందులో దూకేశాను," అని యువకుడు తన కథ చెప్పగానే, ధీర సింహుడు అతన్ని బయటకు తీసుకువచ్చి, తలిదండ్రులకు వప్పజెప్పాడు. బతికి వచ్చిన కొడుకును కళ్ళారా చూచుకొన్న ఆ తలిదండ్రుల సంతోషానికి మేరలేక పోయింది. వాళ్ళు పుత్రభిక్ష పెట్టిన ధీర సింహుణ్ణి వేనోళ్ళపొగడి దీవించారు.

అక్కడినించి ధీరసింహుడు మళ్లీ తన తోవను తను పోతూవుండగా, ఒక పట్టణం తగిలింది. అక్కడ మాయస్నానాలగదిని గురించి ఎవరిని అడిగినా మాకు తెలియ దంటే మాకు తెలియదన్నారు. కాని, చివరకు ఒక వృద్ధుడుమాత్రం ధీర సింహుణ్ణిచూచి "నాయనా! అ స్నానాల గదివద్దకు వెళ్లినవాడెవ్వడూ తిరిగిరాలేదు. అందుకనే ఆ పట్టపురాజు గదిలోపలకు ఎవ్వరూ పోకుండా కాపలా పెట్టాడు. వృథాగా ఎందుకు ప్రాణాలు పోగొట్టు కుంటావు? నా మాట విని తిరిగిపో" అన్నాడు.

ధీరసింహుడు ఎంతమాత్రము చలించక, చెబితేకాని వీలులేదన్నాడు. అందుచేత, తప్పనిసరి ఐ వృద్ధుడు, ఆ మాయస్నానాలగది ఉండే పట్టణానికి దారి చెప్పాడు. వృద్ధుడు చెప్పిన దోవనే వెళ్ళి, ధీరసింహుడు ఆ పట్టణం చేరుకొన్నాడు.







అప్పటినించీ ధీరసింహుడు రోజుకొక రకపు చిత్రమైన బహుమానాలు తీసుకొని వెళ్లి, రాజకు సమర్పిస్తూ ఉండేవాడు. రాజు చాలా సంతోషించేవాడు.

ఇలా వుండగా, ఒకనాడు రాజు ధీరసింహునితో "ఎప్పుడూ నీవే నాకు ఎన్నెన్నో బహుమతులు ఇస్తున్నావుగాని, నన్ను ఎన్నడూ ఏమీ కోరవేమిటి?" అనేవరకు, "నాకోరిక తప్పక తీరుస్తారా?" అని అడిగాడు ధీరసింహుడు.

అందుకు రాజు "సంశయించక అడగవలిసింది. నా రాజ్యం కావాలన్నా ఇస్తాను. చివరకు నా ప్రాణాలు కోరినా అర్పిస్తాను" అని అభయమిచ్చాడు. ఈ వాగ్దానం తీసుకొని, ధీరసింహుడు "అయితే రాజా! మాయస్నానాగారంలోకి వెళ్లటానికి అనుమతి యిప్పించండి" అని కోరాడు.

పాపం, రాజు చిక్కులోపడ్డాడు. అక్కడికి ధీరసింహుడు వెళ్ళటం రాజుకు సుతరామూ ఇష్టంలేదు. అయినా, మాట తప్పడానికి వీల్లేదు. "నీకీ సలహా ఏ పాపాత్ముడో చెప్పివుంటాడు. ఆ మాయలో పడ్డవాళ్ళెవ్వరూ తిరిగి రాలేదు. కనుక, ఇది తప్పించి మరేదైనా కోరుకో" అని అనేకవిధాల నచ్చజెప్పజూచాడు. కాని ధీరసింహుడు వినలేదు. చేసేదిలేక, దుఃఖిస్తూనే, రాజు చీటీవ్రాసి యిచ్చాడు.

ఆ చీటీ తీసుకొని ధీరసింహుడు మాయ స్నానాలగదివద్దకు వెళ్ళాడు. ద్వారందగ్గర ఒక పలకమీద "ఈ మాయలోపడ్డ వాళ్ళెవరూ తిరిగిరాలేదు" అని వ్రాసి ఉన్నది. అక్కడ చాలామంది ఫారావాళ్లు కాపలా కాస్తున్నారు. వాళ్లుకూడా ధీరసింహునికి అనేకవిధాల నచ్చజెప్పి చూచారు. కాని, లాభంలేకపోయింది. విధిలేక, వాళ్ళు తలుపులు తెరిచి ధీరసింహుణ్ణి లోపలికి పంపించారు





ధీరసింహుడు లోపలికి వెళ్ళాడో లేదో, తలుపులు దభీమని వాటంతటవే మూసుకున్నై. అతను వెనక్కు తిరిగి చూచేటప్పటికి, తలుపులూ లేవు, గోడలూ లేవు.

మరికొంతదూరం వెళ్ళేసరికి, ఒక మంగలి ఎదురువచ్చి, ధీరసింహుణ్ణి ఒక విశాలమైన గదిలోకి తీసుకుపోయాడు. గది అద్దంలా శుభ్రంగా వుంది. ఆ మంగలి ఒక తొట్టెలో చన్నీళ్ళూ వేడినీళ్ళూ కలిపి, రెండు చెంబుల నీళ్ళు ధీరసింహునికి పోసి, ఒళ్ళు తోమాడు. మూడవ చెంబు నీళ్ళు పోసేసరికల్లా ధాంమ్మని ఒక పెద్ద శబ్దంపుట్టి, చీకటి కమ్మింది. ధీరసింహుడు కళ్ళుతెరిచి చూచేటప్పటికి మంగలీ, తొట్టె, చెంబూ అన్నీ మాయమైనాయి.

కాని, నీరుమాత్రం అంతకంతకు పొంగిపోయి, ధీరసింహుని గొంతువరకూ వచ్చింది. ఇదేమిట్రా భగవంతుడా! అని అతను చింతిస్తూవుండగా, గదిపైన కప్పుకి వేలాడుతున్న గొలుసు ఒకటి కంటపడింది. ఒక్కసారిగా



అతను ఎగిరి, ఆ గొలుసు పట్టుకు లాగాడు. వెంటనే మళ్ళీ పెద్ద శబ్దమై, కటికచీకటి కమ్ముకుంది. ధీరసింహుడు కళ్ళు తెరిచేసరికి, ఆ గదీలేదు, నీళ్ళూ లేవు. శుభమైన పాడినేలను అతను నిలబడివున్నాడు.

అక్కడినించి ధీరసింహుడు ఎంత నడిచినా అంతూలేదు, పొంతూలేదు, అతనికి అమితంగా ఆకలయింది. సమీపంలోనే కొన్ని ఫలవృక్షాలు కనిపించగా, ఆ పళ్ళు కోసుకొని తిన్నాడు. కాని, అవి ఎన్నితిన్నా ఆకలి తీరలేదు.

అలానే ధీరసింహుడు కొంతదూరం పోగా, ఒక మండపం కనిపించింది. ఆ మండపంచుట్టూ వేలకొద్ది రాతివిగ్రహాలు పడివున్నయి. జీవంమాత్రం లేదు కాని, చూడటానికి అవి అచ్చు మనుష్యులలాగానే కనపడుతున్నవి. ఆ మండపానికి ఎదురుగా రాతి అరుగుమీద ఒక ధనుస్సు, బాణాలతో నిండిన అంబుల పొదీ కనిపించినై.

ధీరసింహుడు మెల్లగా ఆ మండపం దగ్గరకు వెళ్ళిచూడగా. దాని కప్పుకి ఒక పంజరం వేలాడివుంది. ఆ పంజరంలో పంచవన్నెల రామచిలుక ఉన్నది. ఆ






సమీపంలో ఒక రాతి పలకమీద ఇలా వ్రాయబడింది:— "పదివందల సంవత్సరాల క్రిందట, శ్రీ హర్షమహారాజు వేటకు వెళ్ళగా, ఆయనకు ఒక కొండదగ్గర అపరూపమైన ఒక జీవమణి దొరికింది. అటువంటి మణి ఈ భూలోకంలో మరెక్కడా లేదు. ఆయన చనిపోయే ముందు, ఆ మణిని ఈ చిలుకచేత మ్రింగించి, చిలుకను ఒక పంజరంలో బంధించి, ఈ మాయస్నానాల గదిని సృష్టించి, చిలుకను స్నానాగారంలో వుంచాడు. ఈ మాయను ఛేదించి మణిని పొందటానికి ఒక్కటే ఉపాయంవుంది. రాతి అరుగుపైన ఉన్న ధనుస్సుకు బాణం ఎక్కుపెట్టి మూడుదెబ్బలలోపల చిలుక ఎడమకన్నుమీద కొట్టాలి. అలా కొట్టలేని వాడు వెంటనే శిలగా మారిపోతాడు."

ఇది చదివి ధీరసింహుడు నాలుగువైపులా పడివున్న రాతి విగ్రహాలు చూచేవరకు, సంగతి అంతా అర్థమైపోయింది. 'ఈ మాయలో పడి, ఆకలి దప్పులతో ఎలాగూ చావక తప్పదుకదా, అయినా అదృష్టం ఎలా వుంటుందో తేల్చుకుందాం అనుకొని, ధీరసింహుడు బాణం ఎక్కుపెట్టి గురిచూసి



వదిలాడు. దెబ్బ తగులుతుందనగా చిలుక పక్కకు తప్పుకుంది. వెంటనే ధీరసింహుని ఒళ్ళు మోకాళ్లవరకు రాయిగా మారిపోయి, కాళ్ళు లేవలేదు. ఎలానో శ్రమపడి, రెండవ బాణం వదలగా, అదికూడా తప్పిపోయింది. అందుచేత అతను నడుమువరకు రాయిగా మారిపోయాడు. పట్టు వదలక మూడవసారి అతను బాణం వదిలేసరికి, అది సరాసరి పోయి చిలుక ఎడమకంటికి తగిలింది.

దెబ్బతో చిలుక పంజరంలోనించి బయటకు వచ్చేసింది. వెంటనే మేఘాలు కమ్మి, మెరుపులతో ఉరుములతో అపరిమితంగా వర్షించ నారంభించింది.





మొదట ధీరసింహుడు "ఇంకేముంది, నేనూ రాతి విగ్రహమైపోయా" ననుకొన్నాడు. కాని, మరికొంచెంసేపటికే సద్దు మణిగింది. అతను కళ్లు తెరచిచూచే టప్పటికి స్నానాగారమూ, చిలుకా అన్నీ మాయమైనాయి. కొంతదూరంలో మణి మాత్రం ధగధగా మెరిసిపోతున్నది.

ధీరసింహుడు పరుగెత్తుకొనివెళ్ళి, ఆ మణిని తీసుకొని, రాతివిగ్రహాలకు తాకించే సరికి వాటన్నిటికీ మామూలు స్వరూపాలు వచ్చేసి, ఆ మనుష్యులందరూ ధీరసింహుని చుట్టూ మూగారు. ఈనాటికి తమకు ముక్తి కలిగించిన ధీరసింహుణ్ణి వాళ్లు అనేక విధాల పొగడజొచ్చారు. ధీరసింహుడు వీరినందరినీ వెంటబెట్టుకుని వెళ్లి, పట్టపు రాజుతో ఈ సమాచారమంతా చెప్పాడు. ఇది విని రాజుకూడా ధీరసింహుని సాహసానికీ, పట్టుదలకూ, ఉపకారబుద్ధికీ మెచ్చుకుని చాల సంతోషించాడు. ఆ రాజు ధీరసింహునికి అనేకమైన కానుకలిచ్చి, సన్మానించి, అతనివెంట, సులోచనఉండే నగరానికి, తన భటులను తోడిచ్చి పంపాడు.

ధీరసింహుడు వచ్చినట్టు తెలియగానే సులోచన, ఉచితమర్యాదలతో అతన్ని ఆదరించి కూర్చోబెట్టి, అతను చెప్పినదంతా శ్రద్ధతో విన్నది. చివరకు ఆమె "ధీరసింహా! నీవు మాయస్నానాలగదిని గురించి తెలుసుకొనివచ్చిన చిత్రకథ అంతా యదార్థమే. నీవల్ల శాపవిముక్తి పొందినవాళ్ళందరూ నీకీర్తిని దేశదేశాలకు తీసుకుపోయి చెప్పుకొంటున్నారు.

అసలు ఈ మాయను సృష్టించిన పట్టపు రాజునే నీ చాకచక్యంవల్ల మెప్పించ గలిగావు. ఇంతవరకు బాగానేవుంది. నీవు రేపు వచ్చినట్టయితే, ఆఖరుదీ ఐదవదీ అయిన నా ప్రశ్న చెబుతాను" అని ఆమె ధీరసింహుణ్ణి సాగనంపింది. (ఇంకావుంది)

(ఇంకావుంది)








ధీరసింహుడు మరునాడు సులోచనవద్దకు వచ్చి "నీ తరువాత ప్రశ్న ఏమిటి?" అని అడిగాడు.

సులోచన అతనిని మర్యాదచేసి కూర్చోబెట్టి, "ఓయి ధీరసింహుడా!— ఇక్కడకు ఈశాన్యదిక్కున శబ్దభేది అనే పర్వతం ఉన్నదట. ఆ పర్వతంలోపల ఏమిచిత్రం వున్నదో, దాని అవతల ఏ దేశ మున్నదో కనుక్కురావాలి. ఇదే నా ఆఖరు ప్రశ్న" అంటూ చెప్పింది. ధీరసింహుడు మునపటిలాగానే ఆమెవద్ద గడువు తీసుకుని, ఈశాన్య దిశకు బయల్దేరాడు.

చాలా దూరం నడిచివెళ్లి, ధీరసింహుడు ఒక వింత దేశంలో ప్రవేశించాడు. ఆ దేశంలో ఎక్కడా ఒక్క గోరీకాని, శ్మశానం గాని అతనికి కనపడలేదు. ఈ విడ్డూరానికి ఆశ్చర్యపడుతూ, ధీరసింహుడు పోయి పోయి ఒక గ్రామం చేరుకున్నాడు.

అప్పటికి ధీరసింహునికి నకనకమని ఆకలవుతున్నది. ఏమి చేయుటమా అని ఆలోచిస్తూవుండగా, ఎదుటి ఇంటిలోనుంచి ఒక గృహస్థు ఇవతలకి వచ్చి, అతనిని కుశలప్రశ్నలు వేసి, ఆదరించి తన ఇంటికి అతిథిగా తీసుకువెళ్ళాడు.

వడ్డన జరిగింది. భోజనాలు అవుతూ వుండగా గృహస్థు ధీరసింహునితో "మీ దేశంలో మీరు ఎన్నోరకాల పదార్థాలు ఆరగించివుంటారు కాని, ఈ పదార్థం మాత్రం రుచిచూచివుండరు" అంటూ విస్తట్లో ఒక వేపున వేలుపెట్టి చూపాడు. 'ఐతే అది యేమిటి?' అని ధీరసింహుడు ఆశ్చర్యంగా ప్రశ్నించాడు. "అదే నరమాంసం" అని గృహస్థు జవాబు చెప్పేవరకు, ధీరసింహుడు "పాపాత్ముల్లారా! ఇటువంటి పనులా మీ దేశంలో చేసేది!" అని కోపగించి, లేచిపోబోయాడు.







అప్పుడు గృహస్థు అతన్ని సముదాయిస్తూ, "అయ్యా, జబ్బుపడినవాళ్ళనూ, ముసలివాళ్ళనూ చంపి, తినివేయటం మా దేశాచారం, అందువల్లనే మీకు అటువంటి వాళ్ళెవళ్ళూ ఇక్కడ కనిపించరు. పోనీ, అంతగా మీకిష్టం లేకుంటే ఈ పదార్థం తినటం మానివేయండి" అంటూ, అతనికి పాలూ, పండ్లూ, మరికొన్ని శాకాహారాలూ తెప్పించి పెట్టాడు.

గృహస్థు చెప్పిన ఈ భోగట్టా వినగానే అప్పటికి తెలిసివచ్చింది ధీరసింహునికి— ఆ దేశంలో ఒక్క శ్మశానంగాని, ఒక్క గోరీకాని ఎందుకు కనిపించలేదో.

అక్కడినించి ధీరసింహుడు మళ్లీ కొంత దూరం వెళ్ళగా, ఒక పట్టణం తగిలింది. ఆ పట్టణ ప్రజలను శబ్దభేది పర్వతాన్ని గురించి కనుక్కొంటే 'ఇంకా పదికోసులు దూరం పోవా'లన్నారు. సరేనని తిరుగా బయల్దేరి పోయేవరకూ, మరొక పట్టణం తగిలింది. అక్కడకూడా భోగట్టా చేయగా 'మరొక్క కోసెడు దూరం పోయి కనుక్కో' మన్నారు. అక్కడినించి కొంతదూరం వెళ్ళగా మరొక పట్టణం తగిలింది. ఆ ఊరివారిని అడిగితే "ఇంకొక్క మైలు దూరంలో వున్నది ఆ పర్వతం" అని చెప్పారు.

కొంచెంసేపు ఆ పట్టణంలోనే విశ్రమించి, చివరకు ధీరసింహుడు పర్వతం చేరుకున్నాడు. ఆ పర్వతం ఎంతో ఎత్తుగా వున్నప్పటికీ, అతను ఎలానో శ్రమపడి ఎక్కాడు. ఆ పర్వతం చూడటానికి మామూలు అన్ని పర్వతాలలాగానే వున్నది కాని, విశేషాలేమి కానరాలేదు. కనీసం చెట్లూ మొక్కలూ ఐనా కనిపించలేదు. పచ్చగడ్డిమాత్రం అంతటా పరుచుకొని వున్నది. ఆ పచ్చగడ్డి లేనిచోట. లోపలినుంచి ఎర్రటి రాళ్ళు తొంగిచూస్తున్నై.





వింతలేమైనా కనిపిస్తాయేమోనని చాలా సేపు కనిపెట్టివుండి, ఏమీ కనపడకపోయే సరికి ప్రాణంవిసిగి, ధీరసింహుడు పర్వతం మీదినుంచి దిగి వచ్చేశాడు.



దిగివచ్చేశాడేకాని, పట్టుదల గల ధీరసింహుడు ఊరుకొంటాడా?— ఎంత కాలమైనాసరే అక్కడనే ఆగి, ఆ పర్వతం యొక్క పుట్టుపూర్వోత్తరాలు కనుక్కొని గాని పోకూడదని నిశ్చయించుకొన్నాడు. ఈ నిశ్చయంతో అతను ఆ పట్టణంలోని ఒక సత్రంలో బసచేశాడు. అతని మంచితనం వల్ల అక్కడివారందరూ స్నేహితులైనారు. అందులోనూ ముఖ్యంగా వీరవర్మ అనే యువకుడు ధీరసింహునికి ప్రాణస్నేహితుడైనాడు. వారిద్దరూ ఒకరినొకరు విడిచి ఒక్క క్షణమైనా ఉండలేకపోయేవారు.

ఈవిధంగా కొన్నాళ్ళు గడిచినై. ఒక రోజున వీరవర్మ, ధీరసింహుడూ కలిసి ఆ పట్టణపు బజారులో తిరుగుతూవుండగా, చీకటి పడిపోయింది. కాని, కలకల్లాడుతూ దీపాలు ఉండటంచేత, బజారంతా దేదీప్యమానంగా వెలిగిపోతున్నది. స్నేహితులిద్దరూ సరదాగా కబుర్లు చెప్పుకొంటూ ఆ బజారువెంబడి పచార్లు చేస్తూవుండేటంతలో శబ్దభేది పర్వతం ఉండే దిక్కునుంచి "రా, రా, శీఘ్రం రా" అనే ఒక పెద్దకేక వినిపించింది. ఆ కేక మానవుల కంఠస్వరంలాగా కాక, పర్వతంలోనుంచి బయల్దేరిన మేఘగర్జనలాగా ఉన్నది.

తక్షణమే, ధీరసింహ వీరవర్మలకు ఎదురుగా తిరుగుతూవున్న గుంపులోనించి ఒక మనిషి, ఆ కేక వినిపించిన దిక్కుగా, వెర్రివానిలా పరుగెత్త జొచ్చాడు. అప్పుడు ఆ మనిషి ముఖం అదోకలాగా ఐపోయింది. వాని కళ్ళు ఎక్కడో చూస్తున్నై. అతనికి తన శరీరమూ బయటి ప్రపంచమూ రెండూ తెలియకుండా పోయినై.







వానివెంట ధీరసింహుడుకూడా కొంత దూరం పరుగెత్తాడు. ఇంతలో నలుగురూ కలిసి వానిని ఆపుచేయగా, వాడు వెనక్కు తిరిగివచ్చాడు. తరువాత ధీరసింహుడు వానితో "ఇంకెప్పుడూ ఇలా చేయకు" అని మందలించి పంపి, స్నేహితుడైన వీర వర్మను "ఆ కేక ఏమిటి? ఈ మనిషి ఆ వైపు పరుగెత్తడ మేమిటి? దీని రహస్యం వివరించి చెప్పవలసిం"దని ఆత్రంతో ప్రశ్నించాడు.

అప్పుడు వీరవర్మ అతనితో "వోయి నేస్తం!— ఆ కేక ఎందుకు వస్తుందో ఎవరికీ తెలియదు కాని, అప్పుడప్పుడు ఇటువంటి శబ్దం ఆ పర్వతంలోనించి వస్తుందని మాత్రం అందరికీ తెలుసు. ఆశబ్దం ఎవరినైతే పిలుస్తుందో, వాడు ప్రపంచాన్ని మరిచిపోయి, పర్వతంవేపు వెర్రిగా పరుగులెత్తుతాడు. అలా పరుగెత్తిపోయిన వాళ్లలో ఒకళ్ళూ ఇంతవరకూ తిరిగి రాలేదు. వాళ్ల కోసం దుఃఖించి ప్రయోజనం లేదు. అందుకనే, అలా వెళ్ళిపోయినవాళ్ళనుగురించి ఈ పట్టణంలో ఎవరూ విచారించరు," అని చెప్పాడు.

ధీరసింహుడు నలుదిక్కులా కలియజూచాడు. ఆ పోయిన వానిని గురించి నిజంగానే ఎవరికీ పట్టినట్టే కనిపించలేదు. ఈ సంగతి అతనికి ఆశ్చర్యం కలిగించింది. ఆలోచనలో మునిగి, అతను తన బసకు తిరిగివెళ్ళాడు.

ఇలా వారంరోజులు గడిచినతరువాత, మళ్ళీ ఒకరోజున వీరవర్మ, ధీరసింహుడూ మామూలుగా బజారులో షికారు చేస్తున్నారు. మళ్ళీ ఈ రోజున మునుపటి మోస్తరుగానె ఆ పర్వతం మీదినుంచి "రా, రా, శీఘ్రం రా" అనే కేక వినిపించింది. ఈ కేక ఎవరిని ఉద్దేశించిందో, ఈ సారి ఎవరి వంతోనని ధీరసింహుడు అక్కడ





వున్న అందరివేపూ పరిశీలనగా చూస్తూ వున్నాడు. అతను అలా చూస్తూ ఉండగానే, తన ప్రాణమిత్రుడైన వీరవర్మ అతని చేయి విడిపించుకుని పర్వతంవేపు వెర్రిగా పరుగులెత్త నారంభించాడు.

అప్పుడు ధీరసింహుడు గ్రహించాడు, ఇప్పుడు వచ్చిన పిలుపు తన ప్రాణ స్నేహితుడైన వీరవర్మకోసమేనని. "సరి, ఏమైనా కానీ, ఈసారి ఈ పర్వతం యొక్క రహస్యం కనుక్కొని తీరాలె అని నిశ్చయించుకొని, అతను విడువకుండా తన స్నేహితుడైన వీరవర్మను వెంబడించాడు. కొంతసేపటికి వారిద్దరూ ఒకరి వెనుక ఒకరు ఆ కొండ దాపునకు చేరుకున్నారు. ఇద్దరూ కొండ ఎక్కటానికి ప్రారంభించారు. పైకి కొంతదూరం వెళ్లగా, వారికి ఒక బండరాయి అడ్డంవచ్చింది. వీరవర్మ ఆ రాయి అంచు పట్టుకుని దూకే వరకు, ఉపాయశాలి ఐన ధీరసింహుడు అతని కాళ్ళు పట్టుకుని, అతనితోపాటు అవతలి వేపుకి దూకాడు.

అదంతా పచ్చికతో నిండిన ఒక పెద్ద మైదానం. ఆ మైదానంలో వారిద్దరూ ఒకరి వెనుక ఒకరు పరుగులెత్తుతూవున్నారు. ధీరసింహుడు ఎన్ని కేకలు వేసినా, అతని స్నేహితుడు పలకనేలేదు. ఇలా మరికొంచెం దూరం వెళ్ళగా, చూస్తూ ఉండగానే అతనిముందు ఒక్క పది గజాల దూరంలో బ్రహ్మాండమైన శబ్దం చేస్తూ, భూమి బ్రద్దలైంది. వీరవర్మ దానిలో పడి మాయమైనాడు. వెంటనే భూమి ఎప్పటిలాగా మూసుకుపోయింది. చూస్తే, భూమి బ్రద్దలైన అనవాలు ఏమీ కనపడక, పచ్చికతో మామూలుగానే కప్పబడివున్నది. చేసేది లేక, ధీరసింహుడు పర్వతానికి అవతలపక్కని ఏముందో చూచివద్దామనే ఉద్దేశంతో ఆ దిక్కుకి నడిచివెళ్ళాడు.







కొంతదూరం వెళ్లేటప్పటికి, అతని కాళ్లు పట్టుకుపోసాగినై, కన్నులలోనుంచి మంటలు బయల్దేరినై. అక్కడ భూమి అంతా వేడిగా వుంది. ఒకొక్క రాయి ఒకొక్క పెనంలాగా కాలిపోతున్నది. ఈ వెచ్చదనానికి కారణం ఏమిటా అని అతను ఊహిస్తూ మరికొంచెం దూరం పోయేవరకు, అతని కనులముందు ఒక భయంకరమైన అగ్నినది ప్రవహిస్తున్నది. ఆ నదిలోని మంటలు తరంగాలలాగా లేస్తూ, ఆకాశానికి అంటుతున్నయి.

"ఇటువంటి నది ఎక్కడా చూడలేదే. దీనిని దాటడం ఎలాగా భగవంతుడా!" అని ధీరసింహుడు తీవ్రంగా యోచిస్తూ ఉండగా, సిప్పకికూడా కాలని ఒక చిత్రమైన నావ ఒడ్డుకి కొట్టుకువచ్చింది. అతను ధైర్యంతో, ఈ చిత్రమేమిటో చూదామని ఉద్దేశించి, దేముని తలుచుకుని ఆ నావ ఎక్కి కూర్చున్నాడు. కను మూసి తెరిచేటంతలో ధీరసింహుడు ఆ అగ్నినదికి ఆవతల ఒడ్డు చేరుకొన్నాడు. ఈ సంఘటనకు ఆశ్చర్యపోతూ, అతను మళ్ళీ ఆనందంగా నడక సాగించాడు.

కొంతదూరం పోయేటప్పటికి, అక్కడి భూమి అంతా ధగధగ వెండిలా మెరిసిపోతున్నది. అక్కడ ఒక నది ప్రవహిస్తున్నది. అందులో నీరు తెల్లగా వెండిలాగా ఉంది. ఈ నీరు తాగటానికి పనికివస్తుందేమోనని, ధీరసింహుడు నదిలో చెయి ముంచేసరికి, ఆ చెయి కాస్తా వెండిదైపోయింది.

ఇంతలో ఆ నదిలోనుంచి ఒక నావ రాగా దానిలో ఎక్కి కూర్చున్నాడు, సాహసుడైన ధీరసింహుడు. ఆ నావలో మనుష్యులెవళ్ళూ లేరుకాని, ఒక గిన్నెలో దివ్యమైన భోజనమూ, లోటాతో మంచినీళ్ళుమాత్రం అమర్చివున్నయి. ఆకలి వేస్తున్నప్పటికీ,





అతను 'ఇవి ఎవరికోసమో, మనమెందుకు తాకాలె' అని తలిచి ఊరుకొన్నాడు. అతను అలా సంశయిస్తూఉండగా, నదిలోని చేప ఒకటి తల బయటికి పెట్టి, "ధీరసింహా! ఇవి నీకోసమే, తీసుకో" అని చెప్పేసరికల్లా అతను ఆకలిదప్పులు తీర్చుకుని, విశ్రాంతి కోసం ఒక్కక్షణం పడుకొన్నాడు. తరువాత మెలకువవచ్చి అతను కళ్లు విప్పేటప్పటికి, మునపటిలాగానే అవతలి ఒడ్డున ఉన్నాడు. ఈసంఘటనలన్నీ దైవికములే అని నమ్మి, ధీరసింహుడు మళ్లీ సహజమైన ఉత్సాహంతో నడిచిపోజొచ్చాడు.




మరికొంచెం దూరం అతను సాగిపోగా అక్కడి భూమి అంతా పన్నెండో వన్నె బంగారంలాగా తళతళ మెరిసిపోతున్నది. అక్కడ, నేలమీద నవరత్నాలూ, రకరకాల మణులూ కుప్పలుకుప్పలుగా పోసివున్నై. ఆ రత్నాలలో ఒక్కొకటి ఒక్కొక్క రాజ్యం ఖరీదు చేస్తుంది. ధీరసింహుడు ఈ రత్నాలను పంచెలో పట్టినన్ని మూట కట్టుకొన్నాడు.

కాని, ఇంతలో "ఓయి ధీరసింహా!— అందులో ఆరు రత్నాలనుమాత్రం నీ వద్ద ఉంచుకో. తక్కినవాటిని పారవేయి. ఈ రత్నాలు మానవులకొరకు కాదు. లోభించి నావంటే కీడు మూడుతుంది సుమా!" అంటూ ఒక వాణి పలికింది. ఆప్రకారం అతను ఆరు రత్నాలుమటుకి అట్టే పెట్టుకుని తక్కినవన్నీ విసరిపారవేశాడు.

ఈ రత్నాలు పట్టుకుని ధీరసింహుడు అలా కొంతదూరం పోయేవరకు, అతని ఎదుట ఒక విచిత్రమైన నది ప్రవహిస్తున్నది. అందులోని జలమంతా బంగారపు జలమే. ఈ వింత ఏమిటా అని అతను అలా ఆలోచిస్తూవుండగా ఒక బంగారు నావ ఒడ్డుకి వచ్చింది. అందులో ఎక్కి ఇదివరకులాగానే నదిని దాటి కొంతదూరం





నడపగా మరిఒక నది కనిపించింది. తీరా చూడగా, ఈ నదిలో నీళ్ళు మామూలు మంచినీళ్ళే. దీనిలో అతను చేతులు కడుక్కునేసరికి, ఇదివరకు వెండిచెయిగా మారిపోయిన ధీరసింహుని చేయి మామూలుగా వచ్చేసింది. కాని, గోళ్ళుమాత్రం వెండివిగానే ఉండిపోయినై.

తరువాత అతను ఒక అడవిదాటి, మళ్లీ ఒక గ్రామం చేరుకున్నాడు. ఆ గ్రామస్థుల్ని కనుక్కోగా, సులోచన ఉండే పట్టణం అక్కడికి చాలా దగ్గర అని తెలియవచ్చింది. అప్పుడు ధీరసింహుడు దారి తెలుసుకుని, కౌశాంబీనగరం చేరుకుని సులోచన భవనానికి వెళ్లాడు. ధీరసింహుడు వచ్చిన సంగతి తెలియగానే, సులోచన అతనిని ఆదరించి, కూర్చోపెట్టింది.

అతను, శబ్దభేది పర్వతాన్నిగురించి తను తెలుసుకువచ్చిన వివరాలన్నీ విప్పి చెప్పాడు. ఆ పర్వతం అవతల ఏమి ఉన్నదో, తను ఏమేమి వింతలూ విడ్డూరాలూ చూచాడో, అవన్నీ వెల్లడించాడు. నిదర్శనంగా అతను చేతపట్టుకువచ్చిన ఆరు రత్నాలూ ఆమెకు చూపించాడు. వెండినదిలో తన చేయి ముంచగా, వెండివిగా మారిపోయిన చేతిగోళ్ళు కూడా చూపించాడు.

ఇవన్నీ చూచి "ధీరసింహా!—నీ మాటలన్నీ అక్షరాలా నిజం. నేను నిన్ను పూర్తిగా నమ్మాను. నీ ప్రజ్ఞలకు సంతోషించాను. నీవు నిజంగా అసాధ్యుడవు గనుకనే, నా అసాధ్యమైన ప్రశ్నలకు జవాబు చెప్పగలిగావు. ఈ లోకంలో నిన్ను మించిన సాహసుడు, గుణవంతుడు, యుక్తిపరుడూ మరొకడు లేడు" అంటూ అతనిని మెచ్చుకొన్నది సులోచన.

తరువాత ఊరి పెద్దల ఏర్పాటుప్రకారం, సులోచన, ధీరసింహులకు వివాహమై, వారు హాయిగా ఉంటున్నారు. (ఐపోయింది)

